# తెలుగు ఉపవాచకము

## 8 వ తరగతి

రచయిత

డా. ఎన్. గంగప్ప. ఎం.ఏ., పిహెచ్ డి

సంపాదకుడు

డా. వి. రాధాకృష్ణ. ఎం.ఏ., పిహెచ్ డి

చిత్రకారుడు

యస్. జనార్ధన్



ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ప్రచురణము

హైదరాబాదు

# పీఠిక

ప్రస్తుతం అమల్లో ఉన్న పాఠ్యప్రణాళిక ప్రకారం ఈ ఉపవాచక రచన జరిగింది. ఎనిమిదో తరగతి విద్యార్థులకు ఒక్క ఉపవాచకం చాలునని నిర్ణయించారు. ఉపవాచకం ద్వారా మరికొన్ని విషయాలు తెలుసుకోవచ్చు-వాచకంలో లేనివి. ఇందులోని పాఠాలు నేటి తెలుగు భాషలో ఎంతటి గొప్ప విషయాన్నయినా సులభసుందరంగా చెప్పవచ్చునని రుజువు చేస్తాయి.

ఈ ఉపవాచకంలోని "శిబి" వృత్తాంతం పురాణగాథ. అహింసను, ధర్మబుద్ధిని, దాతృత్వాన్ని ప్రబోధించే పాఠమిది. "కాటమరాజు" కథ తెలుగు జానపదుల కళాశిల్పానికి, చరిత్రదృష్టికి మచ్చుతునక. సుప్రసిద్ధ కవయిత్రి "మొల్ల"ను గురించిన పాఠం స్త్రీ విద్యను, రామాయణ ప్రశస్తిని తెలియజేస్తుంది. త్యాగయ్య, వీరబ్రహ్మాలు మహాభక్తులయిన కవులు. యల్లాప్రగడ సుబ్బారావు తెలుగువారికి పేరుప్రఖ్యాతులు తెచ్చిపెట్టిన శాస్త్రవేత్త. వీరిని గురించి క్లుప్తంగా విద్యార్థులకు తెలియజేయుటయే ఉపవాచక లక్ష్యం.

భాష భావప్రతిపాదనకు గాని, అర్థబోధకు గాని అడ్డంకి కారాదు. ఆ దృష్టితో రాసిన ఈ ఉపవాచకాన్ని అనుభవజ్ఞులయిన ఉపాధ్యాయులు పరిశీలించిన తరవాత వారి సూచనల మేరకు పరిష్కరించి ప్రచురించటం జరిగింది. ఉపాధ్యాయులూ విద్యార్థులూ ఈ గ్రంథాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

# జాతీయ గీతము

జనగణమన అధినాయక జయహే

భారత భాగ్య విధాతా!

పంజాబ, సింధు గుజరాత, మరాఠా,

ద్రావిడ, ఉత్కళ, వంగ!

వింధ్య, హిమాచల, యమునా, గంగ,

ఉచ్ఛల జలధి తరంగ!

తవ శుభనామే జాగే!

తవ శుభ ఆశిష మాగే!

గాహే తవజయ! గాథా!

జన గణ మంగళదాయక జయహే!

భారత భాగ్య విధాతా!

జయహే! జయహే! జయహే!

జయ జయ జయ జయహే!

# ప్రతిజ్ఞ

భారతదేశము నా మాతృభూమి. భారతీయులందరు నా సహోదరులు.

నేను నా దేశమును ప్రేమించుచున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణము. దీనికి అర్హుడనగుటకై సర్వదా నేను కృషి చేయుదును.

నా తల్లిదండ్రులను, ఉపాధ్యాయులను, పెద్దలందరిని గౌరవింతును. ప్రతివారితోను మర్యాదగా నడచుకొందును.

నా దేశముపట్లను, నా ప్రజలపట్లను సేవానిరతి కలిగియుందునని ప్రతిజ్ఞ చేయుచున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందమునకు మూలము.

# విషయసూచిక

# 1. శిబి

ప్రాణిరక్షణకొరకు ఆత్మత్యాగం చేసిన ఎందరో కరుణామయులను మనమెరుగుదుము. గరుత్మంతుని బారినుండి నాగులను రక్షించడానికి తన శరీరం ఆహారంగా ఇచ్చిన ఆత్మత్యాగి జీమూతవాహనుడు. అర్థులకు తన అన్నంపెట్టి చివరికి తాను త్రాగదలచిన మంచినీటిని దాహమన్న వానికి దానంచేసిన మహాత్యాగి రంతిదేవుడు. శరణాగత రక్షకుడని బిరుదు వహించిన వాడు శ్రీరామచంద్రుడు. ఈ మహానుభావుల కోవకు చెందిన వాడే శిబి చక్రవర్తి.



పాండవులు అరణ్యవాసం చేసే సమయంలో ధర్మరాజుకు అనేక ప్రాంతాలు చూపి వింతలు విశేషాలు వివరించాడు రోమశుడు అనే మహర్షి. ఆయన భృగుతుంగమనే పర్వతం చూపి దాని విశేషం వర్ణించి చెప్పాడు. ఇది గంగాతీరంలో ఉంది. శిబి ఇక్కడే యజ్ఞంచేశాడు.

శిబి తండ్రి ఉశీనరుడు. తల్లి మాధవి. తండ్రి తరవాత శిబి చక్రవర్తి ఉశీనర రాజయినాడు. అతని పాలనలో ప్రజలందరు సుఖించారు. అజాత శత్రువని ధర్మరాజుకు ప్రతీతి. అంతకు పూర్వమే భూమిపై శత్రు

దాతుడుగా ప్రసిద్ధికెక్కినవాడు శిబి. ఆయనకు శరణాగతరక్షకుడు అనే ప్రఖ్యాతి కూడా ఉంది.

పైగా శిబిచారిత్ర్య మన్నది ప్రధానంగా పేర్కొనదగిన గుణం. అహింసయే పరమ ధర్మం అనే ప్రగాఢ విశ్వాసం గలవాడు. మాటకి మచ్చ రాకుండా ప్రాణత్యాగానికైనా సిద్ధపడటమే శిబి ఉత్తమ గుణం.

భూలోకంనుంచి దేవలోకం వరకు వ్యాపించిన శిబి కీర్తిప్రతిష్ఠలు ఇంద్రసభలో ప్రస్తావనకు వచ్చాయి.

“అంతటి శ్రేష్ఠుడా శిబి?” ప్రశ్నించాడు ఇంద్రుడు.

“ఔను. చెప్పినమాట నిలబెట్టుకొనే మహానుభావుడు” అని సమాధానమిచ్చాడు అగ్ని.

“అంటే ప్రాణత్యాగంకంటే వాక్కే ముఖ్యమా?” మళ్ళీ ప్రశ్నించాడు ఇంద్రుడు.

“ఔను. శరణాగత రక్షణలో అతనిని మించినవాడు లేడు” నిశ్చయంగా బదులిచ్చాడు అగ్ని.

“శరణాగతరక్షకుడు అనే బిరుదు శ్రీరాముని సొత్తుగానే ఉంది. ఇతనంతటివాడా?” మరింత రెట్టించి అడిగాడు ఇంద్రుడు.

“నిజమే; ఇచ్చిన మాట నిలుపుకోడానికి ప్రాణత్యాగానికైనా సిద్ధపడేటంత మహానుభావుడు” మరింత నిష్కర్షగా సమాధానమిచ్చాడు అగ్ని.

“అయితే శిబిని మనం పరీక్షించవలసిందే. అతని శరణాగత రక్షక బిరుదు బయట పడుతుంది” అని తన అభిప్రాయం తెలిపాడు ఇంద్రుడు.

“తప్పకుండా, మీరే స్వయంగా చూచి సంతోషిస్తారు” దృఢాభిప్రాయం వెలిబుచ్చాడు అగ్ని.

"తగిన సమయంలో మనం పరీక్షచేద్దాం" తన నిర్ణయాన్ని తెలిపాడు ఇంద్రుడు.

"సరే" అని అంగీకరించాడు అగ్ని.

రాజులు చేసే యజ్ఞాలవల్ల దేవతలు ఆనందిస్తారు. దేవతలు ప్రజలను సంతోషింపజేస్తారు. ఇట్టి యజ్ఞాలు అనేకం చేసినవాడు శిబి. ఒకసారి యజ్ఞంచేస్తున్న సందర్భంలో ఒక వింత జరిగింది. ఆహారంకొరకు ఒక పావురాన్ని తరుముతూ వచ్చింది ఒక డేగ. పావురం ప్రాణం గుప్పెట్లో పెట్టుకొని ఆత్మ రక్షణార్థం ఎగిరి వచ్చింది. యజ్ఞదీక్షలో వున్న శిబి చేతిపై వాలింది. గజగజలాడిపోతోంది భయంతో.

"శరణాగతుణ్ని. రక్షించండి. మీవంటి శరణాగత రక్షకులు భూమి మీద మరొక్కరు లేరు. అభయమిచ్చి కాపాడండి" అని మానవ కంఠంతో ప్రార్థించింది కపోతం. ఇది గమనించిన శిబి ఆశ్చర్యంతో "నీకు కలిగిన భయమేమిటి?" అని ప్రశ్నించాడు.

"అయ్యో! కనిపించటంలేదా మహారాజా! ఆ డేగ నా ప్రాణం తీయదలచింది. నా ప్రాణాలు రక్షించండి" దీనంగా ప్రార్థించింది పావురం.

"నీకేభయమూ లేదు. సుఖంగా ఉండు" అని ఊరడించాడు శిబి దాని శరీరం నిమురుతూ.

తన ఆహారం కావలసిన పావురం తప్పించుకొన్నందుకు డేగ బాధపడ్డది. అది తన నోటికాహారం తీయవద్దని శిబిని ప్రార్థించింది.

డేగ : మహారాజా! మీరు సత్యవంతులు. ధర్మనిరతులు. నిర్మల మనస్కులు అని ప్రసిద్ధి. అట్టి మీకిది న్యాయమా?

శిబి నేనిప్పుడు చేసిన అన్యాయమేమిటి ?

డేగ : ఆకలితో నకనక లాడిపోతున్నాను. నాకాహారమైన పావురాన్ని రక్షించదలచినట్లున్నారు. నాకు తిండిలేకుండా చేస్తారా?

శిబి : కాని పావురం నా మరుగు చొచ్చింది. శరణన్నవానిని రక్షించటం నా మతం.

డేగ : సర్వప్రాణులు ఆహారంవల్లనే జీవిస్తాయి. ఆకలిగొన్నవారికి అన్నం పెట్టడం మీకు ధర్మం. నాకీ పక్షి ఆహారం కాకపోతే నేను ఆకలి బాధతో మరణిస్తాను. నా మరణవార్త విన్న నా ఆలుబిడ్డలు జీవించలేరు. ఒక్క కపోత రక్షణకు ఇందరి ప్రాణాలు తీసి జీవహింసకు ఒడిగడతారా? ఇది ధర్మ విరుద్ధమని మీకు తెలియదా?

శిబి : నాముందే ధర్మసూత్రాలు వల్లిస్తున్న నీవు సామాన్యుడవుకావు.

డేగ : రాజా! మీరు ధర్మపరులు. ధర్మవిరుద్ధమైన దానిని మీ బోంట్లు లెక్కచేయరు. అందరికీ హితమైనదే ధర్మంగదా? దీనికి కారణముంది. ఈ పావురం నాకు దైవదత్తమైన ఆహారం. డేగలు పావురాలను ఆహారంగా తింటాయి అనే విషయం తమరెరుగనిదికాదు. కాబట్టి నాఆహారం నాకీయవలసిందిగా ప్రార్థన.

శిబి : నీ మాటలలో ఆవంత అబద్ధం లేదు. కాని ఈ పక్షి నా శరణు వేడింది. నేను అభయమిచ్చాను. ఆశ్రితుణ్ని ఎట్టి అధముడైనా వదలడు. నేను దీన్ని విడువగలనా? మరి ఆశ్రితులను ఉపేక్షించటం ధర్మమా? నీవు పక్షివైనా ధర్మం తెలిసినట్లు చెప్పావు. శరణాగత పరిత్యాగం కంటే అధర్మముంటుందా? నీవేచెప్పు.

డేగ : ఆకలిగొన్నవాడు ఏ పాపానికయినా సిద్ధపడతాడే. క్షుద్బాధతో ఉన్న నేను నా సహజాహారం కూడా తినగూడదా?

శిబి : నీ ఆకలి ఈ పక్షిని తింటేనే తప్ప తీరదా? ఒకమాట. నీవు ఆకలితో ఉన్నావు. నీ ఆకలి తీరడానికి ఆహారం అవసరం. ఒప్పుకుంటాను. ఈ అరణ్యంలో రకరకాల జంతువులున్నాయి, బహువిధాల పక్షులు

ఉన్నాయి. వాటి మాంసమెంతైనా పెట్టగలను. ఈ పక్షిని మాత్రం వదులు. నేనెలాగూ దీన్ని కాపాడక తప్పదు. ఇది నా నిశ్చయం.

డేగ : నాకీ పక్షి విహితభక్షణం. ఇది ధర్మమని వేదవాక్కు. విన్నవించాను.

శిబి : నీ పట్టుదల చూడగా బలహీనులను బలవంతులు అణచినట్లే ఉన్నది. బలహీనులకు బలం రాజు. నా రక్షణలో ఉన్న ఈ బలహీనమైన పావురం నీకు ఆహారం కాకుండా రక్షిస్తాను. శరణాగతరక్షణ రాజుల కర్తవ్యం గదా !

డేగ : వేదవిహిత ధర్మం నేను వివరించాను. మీ ధర్మం మీరు తెలిపారు. మీరు మహారాజులు! పట్టు వదిలేటట్టు లేరు. నేనే పట్టు సడలిస్తున్నాను.

శిబి : ఉభయులకు విహితమై, ధర్మవిరుద్ధం కాకపోతే నేనూ అంగీకరిస్తాను.

డేగ : అంతవరకే సంతోషం, రాజా! ఈ పక్షిని మీరు వదలరు కనుక దీనితో సమానంగా మీ శరీర మాంసం తూచిపెడ్తే తృప్తిగా భుజిస్తాను.

శిబి : నన్ననుగ్రహించావు. నా కర్తవ్యానికి విఘ్నం రాకుండా నీ ఆకలి తీరే మార్గం దొరికింది. ఇందువల్ల నీ ఆకలి తీరుతుంది. ఈ పక్షిని హింసించకుండా రక్షించి జీవకారుణ్యం చూపే అవకాశం నాకూ లభిస్తుంది. కర్తవ్య బోధచేసిన నీకు నా ధన్యవాదాలు.

శిబి అంగీకరించినందుకు అటు డేగా ఇటు పావురం ఎంతో ఆనందించాయి. రాజు సంగతి సరేసరి.

ఆ వెంటనే శిబి త్రాసు తెప్పించి, ఒక పళ్ళెంలో పావురాన్ని పెట్టించాడు. కత్తితో తన శరీరపు కండరాలను కోసి రెండోపళ్ళెంలో వెయ్యడం మొదలుపెట్టాడు. ఎంతమాంసం కోసివేసినా ముల్లు కదల్లేదు. రాజు శరీరం రక్తప్రవాహామయింది. ఆయన నీరసించిపోతున్నాడు. కండలు తరిగినా ముల్లు కదలలేదు. అయినా రాజు పట్టుదల వదలలేదు. శిబి అస్థిపంజరమైనప్పటికీ మాంసంకోసే పనిం మానలేదు. రాజు ప్రాణం కళ్ళల్లోకి వచ్చింది. కాని ఆయన పట్టుమాత్రం సడలలేదు. ఎంత మాంసం వేసినా పక్షితో సమానంగా తూగనందువల్ల చివరకు శిబి తానే పళ్ళెంలో కూర్చున్నాడు. అప్పటికి త్రాసు సరితూగింది.

పక్షులు రెండూ అదృశ్యమయ్యాయి. ఆ స్థానంలో ఇద్దరు మహా పురుషులు ప్రత్యక్షమయ్యారు. తక్షణమే శిబి శరీరం పూర్వస్థితికి వచ్చింది. అంతేకాదు అపూర్వ తేజస్సు కూడా వచ్చింది. శిబి ఆశ్చర్యపడ్డాడు.

ఆ మహాపురుషులు రాజునిట్లా ప్రశంసించారు.

"మహారాజా! మీ ధైర్యం, మీ శౌర్యం, మీ శరణాగత వాత్సల్యం, బలహీనులకు అండదండలుగా నిలిచిన మీ కరుణ, పరహింస సహించక ఆత్మార్పణకు సిద్ధపడిన మీ ఔదార్యం గొప్పవి. నేను ఇంద్రుణ్ని. ఈయన అగ్ని. డేగ పావురాల వేషంలో మిమ్మల్ని పరీక్షించ టానికి వచ్చాము. మీరే విజయం సాధించారు. మీరు సామాన్యులుకారు. భూమిపై వెలసిన మహాపురుషులు. మీ కీర్తి ఆచంద్ర తారార్కం ఉంటుంది" అని పొగిడి వెళ్ళిపోయారు.

శిబి గుణగణాలు దీనివలన మనకు స్పష్టమవుతాయి. శరణన్న వారిని రక్షించడం, జీవకారుణ్యం చూపటం, ఇచ్చినమాట నిలబెట్టు కోవడం అనే నీతులు మనకు వ్యక్తమవుతాయి.

## ప్రశ్నలు

1. శిబిని గురించి దేవసభలో ఎవరు ఏమని ప్రసంగించారు ?
2. డేగ శిబితో ఏమి చర్చించింది ?
3. శిబి గుణగణాలు ఏవిధంగా స్పష్టమవుతున్నాయి ?
4. శిబి పాఠంద్వారా ఇంద్రాదులు నిరూపించిన విషయాలేమిటి ?

---

# 2. కాటమరాజు

ఎందరో వీరాధివీరుల గాథలు కాలగర్భంలో కలిసిపోయాయి. కానీ జానపద గేయాల్లో అటువంటివి కథావస్తువులుగా నిలిచాయి. అలాంటి వాటిలో పదమూడో శతాబ్దికి సంబంధించిన వీరోచిత గాథ కాటమరాజు కథ.



కాటమరాజు యాదవరాజు. ఇతడు నెల్లూరి సమీపాన గల కనిగిరి ప్రాంతాలను పాలించాడు. ఇతని కోట కనిగిరి దగ్గర పంచలింగాల కొండ దిగువన ఉండేది. ఇతడు మహాపరాక్రమ సంపన్నుడు. ఏడు సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడే తండ్రి పగదీర్చటానికి కాటమరాజు వాలికేతు రాజును సంహరించి విజయం సాధించాడు. ఇతనికి విస్తారమైన పశు సంపద ఉండేది. కాటమరాజు "ఆవులమంద కుదిరితే ఆరామడ, చెదిరితే పన్నెండామడ" అని ప్రతీతి. పద్మరాఘవుడు కాటమరాజు మంత్రి. అతనిని పద్మనాయకుడని కూడా అంటారు. తన భుజబలానికి పద్మనాయకుని నీతి బలం తోడు కాగా కాటమరాజు నేర్పుతో రాజ్యం

చేశాడు. అతడి పశుసంపద మూడు పూవు లారుకాయలుగా అభివృద్ధి చెందింది.

ఒకప్పుడు వానలులేక కరువుకాటకాలు కనిగిరి సీమను పీడించాయి. పచ్చలు పొదిగినట్లున్న పచ్చిక పట్టులన్నీ వాడివత్తయి పోయాయి. పశువులు మేతకై వెంపరలాడ మొదలుపెట్టాయి. ఆవులు, ఎద్దులు, కోడె దూడలు, లేగలు, అన్నీ మలమల మాడిపోతున్నాయి. బక్కచిక్కి పోయాయి. డొక్కలు వెన్నుకంటుకొని పోయాయి. ఈ స్థితిని చూచిన కాటమరాజు కడుపు చెరువయింది. రంపంతో కోసినట్లు ఏదో చెప్పరానిబాధ. తన మంత్రి పద్మనాయకునితో కర్తవ్యం ఆలోచించాడు. "నెల్లూరిసీమలో పచ్చిక బీళ్లు, అడవులు విస్తారంగా ఉన్నాయి. నెల్లూరి ఏలిక నల్లసిద్ధిని ప్రార్థించి అక్కడి పచ్చిక బయళ్లలో ఆలమందల్ని మేపుతూ గండం గడపవచ్చు. అందుకు ప్రతిగా ఏటా మనం కొన్ని కోడె దూడల్ని రాజు కివ్వవచ్చు" నని పద్మనాయకుడు తెలిపాడు: కాటమరాజుకు ఈ ఉపాయం నచ్చింది. వెంటనే అతడు నెల్లూరికి సపరివారంగా ప్రయాణమయ్యాడు.

ఆనాటి నెల్లూర ప్రభువు మనుమసిద్ధి కుమారుడైన నల్లసిద్ధరాజు. నల్లసిద్ధి దగ్గర సేనాపతిగా ఖడ్గ తిక్కన, ప్రధానామాత్యుడుగా చింకర్ల భీమిసీడు ఉండేవారు. కాటమరాజు నల్లసిద్ధిని దర్శించి తమకువచ్చిన ఆపదను తెలిపి సహాయం కోరాడు. నల్లసిద్ధిరాజు అందుకంగీకరించి అనుమతి పత్రం వ్రాయించి కాటమరాజుకిచ్చాడు. అడవులలో, పచ్చిక బయళ్లలో పశువులను మేపినందుకు ప్రతి సంవత్సరం మందలోని కొన్ని కోడె దూడలను ఇవ్వాలన్నది అందులోని ఏర్పాటు. కాటమరాజు సంతోషంతో తిరిగి వెళ్లాడు.

కాటమరాజు ఆలమందలు పచ్చికమేసి బలిసినందువల్ల పాడికొరత తీరింది. కాని అడవుల్లో జీవించే వారి భృతికి ఈ ఆలమందలు, వాటిని కాసేవారు అడ్డువచ్చారు. చిలకలు రొద చేస్తుండగా ఆవులు బెదరి

పోయాయి. వెంటనే వాటిని బాణంతో పడగొట్టాడు పద్మనాయకుడు. వాటిలో నల్లసిద్ధి రెండో రాణి కుందమాదేవి పెంపుడు చిలుక ఒకటి. ఇది తెలిసిన కుందమాదేవి గోవులను చంపండని ఆటవికులను ఆజ్ఞాపించింది. ఇందుకు కుపితుడైన కాటమరాజు ఏడాది దాటినా నల్లసిద్ధికి పుల్లరి పంపలేదు. గోనష్టం జరిగిన విషయం నల్లసిద్ధికి తెలియదు. కానీ పుల్లరి చెల్లించవలసిందని రాయబారిగా ఒక భట్టును పంపించాడు.

ఆ రాయబారి కాటమరాజు గుడారాలవద్దకు వెళ్లాడు. నలభై నాలుగు స్తంభాల శిబిరంలో కాటమరాజు కొలువుదీరి ఉన్నాడు. భట్టు మాటలువిని "మీ రాజు చేయించిన గోనష్టానికి మేము చెల్లించవలసిన పుల్లరికీ సరిపోయింది" పొమ్మన్నాడు. రాయబారం చెడినందుకు చింతిస్తూ భట్టు వెళ్లిపోయాడు. కాటమరాజు పద్మనాయకునితో "రాయబారం చెడింది. నల్లసిద్ధి మనపై ఎప్పుడైనా దండెత్తవచ్చు. మనం యుద్ధానికి సిద్ధంగా ఉండటం అవసరం. మన వారందరికీ కమ్మలు రాయించి యుద్ధ సన్నద్ధులై రావలసిందని కబురుపెట్ట" మన్నాడు. మంత్రి తగిన ఏర్పాట్లు చేయించాడు.

రాయబారి తిరిగివచ్చి కాటమరాజు పుల్లరి చెల్లించ నిరాకరించాడని చెప్పగానే నల్లసిద్ధి ఉగ్రుడయ్యాడు. ముఖం జేవురించింది. కన్నులు నిప్పులు గక్కాయి. "పుల్లరి చెల్లించ నిరాకరించి కాటమరాజు కయ్యానికి కాలు దువ్వుతున్నాడు. మనం మన మగటిమి చూపవలసిన తరుణం ఆసన్నమైంది. రణరంగంలోకి దూకి మీ పరాక్రమాన్ని ప్రకటించండి" అని హెచ్చరించాడు. మంత్రి చింకర్ల భీమినీడు యుద్ధరంగంలో సాయం చేయవలసిందని కోరుతూ సామంత రాజులందరికి లేఖలు వ్రాయించాడు. వెంటనే నెల్లూరి పరిసరాలు సైన్యాలతో నిండిపోయాయి. దండనాయకుడు ఖడ్గతిక్కన ఎర్రగడ్డపాటి యుద్ధభూమిలో కాటమరాజు సైన్యాలను ఎదిరించాడు. రెండు దళాలకూ సంకుల సమరమయింది. ఖడ్గతిక్కన సైన్యమంతా నేల కూలింది. అతడు ఏకాకి. తిక్కన

చింతించి మళ్లీ సైన్యాలతో వచ్చి శత్రునాశనం చేయవచ్చునని నెల్లూరికి తిరిగి పోయాడు.

తిరిగివస్తున్న తిక్కనను పౌరులు ఎగతాళి చేశారు. ముదుసలి తండ్రి సిద్ధన "పగరకు వెన్నిచ్చి పిరికి పందలా పారివచ్చావు. నీ బ్రతుకు వ్యర్థ"మని తూలనాడాడు. భార్య చానమ్మ భర్త స్నానం కొరకు మంచం అడ్డుగా ఉంచి పసుపుముద్ద, నీళ్లు పెరటిలో పెట్టింది. 'ముగురాడు వారమైతిమి' అని వెక్కిరించింది. తల్లి పుత్రునికి విరిగిన పాలిచ్చి 'పశువులతోపాటు పాలు కూడా విరిగిపోయాయి' అన్నది. ఈ నిందలు భరించలేక ఖడ్గ తిక్కన సైన్యసమేతంగా వెళ్లి మళ్లీ తలపడ్డాడు. కాటమరాజు పక్షాన బ్రహ్మరుద్రయ్య అనే వీరుడు తిక్కనతో ఘోర యుద్ధం చేసి తిక్కనను చంపి తానూ చచ్చాడు.

ఖడ్గ తిక్కన మరణవార్త విన్న నల్లసిద్ధిరాజు అపారమైన సైన్యాలతో కాటమరాజును ఎదుర్కొన్నాడు. సంకుల సమరం జరిగింది. అపుడు కాటమరాజు కృష్ణుని అవతారంగా భావించిన బొల్లావును పూజించి నల్లసిద్ధి సేనలను తునుమాడుమని ప్రార్థించాడు. బొల్లావు ఎందరో శత్రువులను హతమార్చింది. అయితే నల్లసిద్ధి మాయోపాయంతో చంపించాడు. కాటమరాజు నిరుత్సాహపడ్డాడు. కానీ అతని సేనానులు వెన్నుచూపలేదు. వారిలో ఒకడైన బీరినీడు ఒకే దెబ్బకు మద్దిమాను నరికి తన కత్తికి పదును చూసుకొని నల్లసిద్ధి సైన్యాన్ని ఊచకోత కోశాడు. కానీ అతడు కూడా వీరమరణం పొందక తప్పలేదు. బాలవీరుడు పోచయ్య విజృంభించి పోరాడి వీర స్వర్గం చేరుకున్నాడు. కాటమరాజు సైన్యం బలహీనపడింది.

అప్పుడు కాటమరాజు మంత్రాలోచన చేసి నల్లసిద్ధి సైన్యంపైకి ఆవులను, ఎద్దులను పంపాలని నిర్ణయించాడు. యాదవులు ఆవులను అశ్వాలపైకి, ఎడ్లను గజబలం మీదికి ఉరికించారు. అవి కాల్బలంతో కూడా ఘోరయుద్ధం చేసి మరణించాయి. కాటమరాజు స్వయంగా

నల్లసిద్ధిని ఎదుర్కొన్నాడు. వారి ద్వంద్వ యుద్ధం "దశకుండు కుంభకుండు తారసిలినట్లు, రామరావణులు కదసినట్లు, మత్స్యంబు మొసలియు మల్లాడినట్లు, వారిధి వారిధితో, మేరువు మేరువుతో తాకినట్లు" జరిగింది. కాటమరాజు చేతిలో నల్లసిద్ధి నిహతుడయ్యాడు. అతని సైన్యం కాలికి బుద్ధి చెప్పింది. ఈ ఘోర రణం కాటమరాజు విజయంతో ముగిసింది. దీనికి యాదవుల భారత యుద్ధమని పేరు.

## ప్రశ్నలు

1. కాటమరాజుకు నల్లసిద్ధిరాజుకు ఎందుకు ఏమని ఒప్పందం కుదిరింది ?
2. భట్టు రాయబారం ఎవరిదగ్గర ఎందుకు ఏవిధంగా జరిగింది ?
3. ఖడ్గతిక్కన పాత్ర ఎటువంటిది ?
4. 'యాదవ భారత'మనే పేరు కాటమరాజు కథకు ఎందుకు వచ్చింది ?

---

# 3. మొల్ల

తెలుగులో మొదట పేర్కొనదగిన కవయిత్రి మొల్ల. ఆమె రచించిన రామాయణం ఆమె పేరుమీదుగా మొల్ల రామాయణమని ప్రసిద్ధికెక్కింది.

తెలుగు కవయిత్రులెందరో ఉన్నారు. వారిలో తాళ్ళపాక తిమ్మక్క, రంగాజమ్మ, ముద్దుపళని, బాల పాపాంబ, తరిగొండ వేంకమాంబ పేర్కొనదగిన ప్రాచీన కవయిత్రులు. వీరందరిలోను సర్వోత్తమురాలు మొల్ల.



భారతీయ భాషల్లో రామాయణ కథకు ప్రత్యేకత ఉంది. పలువురు కవులు బహుభాషల్లో రామాయణాన్ని అనేకవిధాలుగా రచించి తరించారు. అలాగే తెలుగులో సైతం మొల్లకు పూర్వమూ, తరువాతా

ఎందరో తెలుగు కవులు రామాయణాన్ని రచించారు. అయినా తెలుగు సాహిత్యంలో మొల్ల రామాయణానికి ఒక ప్రత్యేక స్థానముంది. రామాయణ కథను పాఠకుల మనస్సులకు హత్తుకొనేట్లు మనోహరంగా రచించడమే దీని విశిష్టత.

మొల్ల తండ్రి ఆతుకూరు కేసన. శివభక్తుడు. మొల్ల తాను ఆతుకూరి కేసన వరపుత్రికనని చెప్పుకొంది. బహుశా కేసన తన పుత్రికకు దీక్షనిచ్చి ఉంటాడు. అందువల్లనే వరపుత్రికనని చెప్పుకొంది. గోపవరంలో వెలసిన శ్రీకంఠ మల్లేశుని వరంవల్ల తనకు చక్కటి కవిత్వం అలవడినట్లు మొల్ల తెలిపింది. ఆమె శ్రీకంఠమల్లేశుని వరం పొందినా, ఆరాధించింది మాత్రం శ్రీరామచంద్రునే.

మొల్ల నివాసం నెల్లూరు మండలంలోని గోపవరమని కొందరి అభిప్రాయము. మరికొందరు నెల్లూరు మండలంలోని ఆత్మకూరని భావిస్తున్నారు. ఇంకా కొందరు కడప మండలంలోని బద్వేల్ సమీపంలోని ఆతుకూరని అంటారు. వీరి ఇంటిపేరు ఆతుకూరివారు. మొల్ల పూర్వీకులు ఆతుకూరి నివాసులై, ఆ వెనుక గోపవరంలో స్థిర ఉంటారని కొందరు సమన్వయిస్తారు. క్రీ. శ. 15వ శతాబ్దికి చెందిన శ్రీనాథుని సమకాలికురాలు అని ప్రస్తుతం చాలామంది విమర్శకుల అభిప్రాయం.

కావ్య లక్షణాలు తనకేమీ తెలియవనీ, కేవలం దైవప్రసాదంవల్లనే తనకు చక్కటి కవితాశక్తి అబ్బిందనీ మొల్ల వినయంగా చెప్పుకొంది. తేటల మాటలతో, కొత్తరీతులతో మనోహరంగా కవిత్వం ఉండాలని ఆమె అభిప్రాయం. ఎక్కడ నుడులు అవసరమో, ఎక్కడ సంస్కృత పదాలు ముఖ్యమో గుర్తించి రచించాలని హెచ్చరించి, తన కవనరీతిని స్పష్టంచేసింది. ఇంతేగాక -

"తేనె సోక నోరు తీయన యగురీతి
తోడ నర్థమెల్ల దోచకుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూగ చెవిటి వారి ముచ్చటగును"

అని నిష్కర్షగా తేల్చి చెప్పింది. అందంగా సామెతలను వాడితే "అది తెనుగునకుం బొంకై, కవిత్వము వీనుల విందై" బుధుల మనస్సులను నాగగొనగలదని తెలిపింది. తాను చెప్పినట్లే రామాయణం సులభసుందరంగా రచించింది.

మొల్ల తన కావ్యం శ్రీరామునికి అంకితం చేసింది పోతనలాగా. "పలికెడిది భాగవతమట" అని చెప్పిన తీరులో మొల్ల -

"చెప్పుమని రామచంద్రుఁడు
చెప్పించిన పలుకు మీఁదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపరసాధన
మిప్పుణ్యచరిత్ర; తప్పులెంచకుఁడు కవుల్"

అని వినయ పూర్వకంగా మనవిచేసింది. మొల్లకంటే ముందే తెలుగులో రామాయణాలు వ్రాసినవారున్నారు. మళ్ళీ నీవెందుకు రచిస్తున్నావని ఎవరైనా ప్రశ్నిస్తారేమోనని ముందుగానే సమాధానం చెప్పింది మొల్ల. రామాయణ కథను ఎన్నిసార్లు విన్నప్పటికీ కొత్తభావాలు ఉత్పన్నమవుతాయనీ, రామాయణం వేదంలాగా పవిత్ర గ్రంథమనీ వివరించింది. "భుక్తి ముక్తికి మూలమైన యీ రాజును, దైవమైన రఘురాము స్తుతించినఁ దప్పుగల్గునే?" అని సమర్థించింది.

రామాయణ కథను మొల్ల ఆరు కాండాలలో సంక్షిప్తంగానైనా కమనీయ కావ్యంగా రచించింది. బాల, అయోధ్యా, అరణ్యా, కిష్కింధ

కాండలను క్లుప్తంగానూ, సుందర,యుద్ధకాండలను విస్తృతంగానూ రచించింది. పాత్రల మనోభావాలను మనోహరంగా చెప్పగల శక్తి ఆమెకు ఉంది. సూక్ష్మ పరిశీలన మొల్ల కవిత్వంలో వ్యక్తమవుతుంది. చక్కటి తెలుగు పలుకుబళ్ళు, నుడికారాలు, సామెతలకు కొదవలేదు. "ఎల్లవేళల నేఁ జెవినిల్లు గట్టి విన్నపముసేయ; నేడెల్లి శాంతింపుమా; కూరలు నోటికిన్ రుచులు గూడుటఁ దప్పె; వెన్నతోఁ బెట్టిన విద్య; ఒక తలకుఁ దెచ్చెనౌనని; కంటిలో నెలుసు చందమున; కనుగోఁ బ్రాలైతి"- మొదలైన నుడికారాలు, పలుకుబళ్ళు తెలుగువారి హృదయాలను అలరిస్తాయి. ఇవి ఈనాటికి తెలుగుసీమలో వాడుకలో ఉండడమే మొల్ల భాషాపటిమకు నిదర్శనం.

మొల్ల కమనీయ కవితను చవిచూద్దాం. మృదువైన భావాలు. లలితమైన భాష మొల్లకు వెన్నతో బెట్టిన విద్యలు.మాయలేడిని చంపి,వెనుదిరిగి వచ్చి, పర్ణశాలలో సీత కనిపించనప్పుడు రాముడు విలపించిన తీరు:

"పర్ణశాలలోనఁ బరికించి పరికించి
సీత గానఁబడమిఁ జిన్నవోయి
చిత్తమంత గలఁగి శ్రీరామచంద్రుండు
పలవరింపఁ జొచ్చె భ్రమసి భ్రమసి"

హనుమంతుడు సముద్రం లంఘించిన తీరును మొల్ల చాలా సహజంగా వర్ణించింది:

"మొగము బిగించి, పాదముల మొత్తముగా
నట నూఁది త్రొక్కి, నీ
టుగ మొగమెత్తి, భీకర కఠోర రవంబున

నార్చి, బాహుల

త్యగణితలీల నూచి, వలయంబుగ వాలముఁ

ద్రిప్పి, ద్రేగునన్

నగము నగమ్ముఁ గ్రుంగఁ, గపినాథుఁడు

నింగికి దాఁటె జివ్వునన్"

ఇందులోని భాష సరళమూ, సులభ గ్రాహ్యమూ.

అశోకవనంలో సీత దుఃఖిస్తూన్న సందర్భంలో ఆంజనేయుని మాటలు ఎంతో ఔచిత్యంతో కూడినట్లు మొల్ల రచించింది:

"ఉన్నాఁడు లెస్స రాఘవుఁ,

డున్నాఁ డిదె కపులఁ గూడి యురుగతి, రానై

యున్నాఁడు, నిన్నుఁ గొని పో

నున్నాఁ, డిది నిజము, నమ్ము ముర్వీతనయా!"

చిన్న చిన్న మాటలతో అనునయించి నట్లుంది.

మొల్ల కన్నులకు కట్టినట్లు యుద్ధవర్ణనలు చేయగలదు.

రామాయణ యుద్ధవర్ణన :

"గిరి గిరి నభము నభంబును

ధర ధరనున్ జలధి జలధిఁ దార్కొను రీతిన్

సురరిపుఁడు నసురరిపుఁడును

దురమున నెదిరించి రధికదోర్బలయుక్తిన్"

మధువనంలో ప్రవేశించిన కోతుల చేష్టల్ని స్వభావోక్తిలో మొల్ల వర్ణించింది:

"కాయల వ్రేటు లాడుచును, గంతులు వైచుచుఁ,
బూవుఁదీవలం
దోయల బూఁచుచుం, దేనెవు లాన్చుచుఁ, బండ్లను
బొట్ట నిండఁగా
మేయుచు, వెక్కిరింపుచును, మిన్నకు దాఁటుచు,
ఊరక గెంతుచుం,
కూయుచు, నేల వ్రాఁకుచును గుంపులు గూడి
కపీంద్రు లెంతయున్"

వన మంత గాసి చేశారట.

అందరికీ ఆనందం కలిగించే కథ రామాయణం. ఆ రామాయణ గాథను కమనీయ కావ్యంగా తన పేరుమీద రచించి తరించింది కవయిత్రి మొల్ల!

## ప్రశ్నలు

౧. మొల్ల ఎవరు ? ఆమె రామాయణం ఎందుకు రాసింది ?

౨. మొల్ల కవిత్వంలోని విశేషాలేమిటి ?

౩. మొల్ల కవితాభాషలో కనిపించే ప్రత్యేక లక్షణాలేమిటి ?

---

# 4. క్షేత్రయ్య

తెలుగు సాహిత్యంలో వివిధ శాఖలున్నవి. ప్రాచీన సాహిత్యంలో పద్యకవితకే ప్రాధాన్యం. అయినా ఏ సాహిత్యంలోనైనా పదమే మొదట ఆవిర్భవించింది. పల్లె ప్రజలు తామనుభవించిన కష్ట సుఖాలను గూర్చి ఆడి పాడుకొన్నారు. ఆ పాటలే జానపద గేయాలుగా ప్రచారంలో ఉన్నాయి. పండితులు వాటిని ఆదరించనందున ప్రసిద్ధికి రాలేదు. అయితే తాళ్లపాక అన్నమాచార్యుడు 'సంకీర్తనము' అనే పేరుతో అనేక పదాలు రచించి ఈ పద కవితకు విశిష్టత కల్పించినాడు. అదే పద్ధతిలో పదాలు రచించినవాడు క్షేత్రయ్య.



క్షేత్రయ్య పదాలకు మువ్వగోపాల పదాలని మరోపేరు. కృష్ణా జిల్లాలోని దివి తాలూకాలోని మొవ్వ గ్రామంలో వెలసిన గోపాలుడే మువ్వగోపాలుడు. ఆ వేణుగోపాల స్వామి మీద అనేక శృంగార పదాలు రచించి తరించినవాడు క్షేత్రయ్య. ఈ మొవ్వ గ్రామం కూచిపూడి, పెదపూడి, ఘంటసాల లకు దగ్గరలోనే వుంది. కూచిపూడి నాట్య పద్ధతిని ప్రవేశపెట్టిన సిద్ధేంద్రయోగి క్షేత్రయ్య సమకాలికుడు. మువ్వ శబ్దమే ప్రజల వాడుకలో మొవ్వగా, మువ్వగా మారింది.

క్షేత్రయ్య మొదటి పేరు వరదయ్య. ఇతనికి దక్షిణ దేశంలో క్షేత్రజ్ఞుడని వాడుక. పుణ్యక్షేత్రాలు సందర్శించి, ఆ దేవతలపై పదాలు రచించాడు.

క్షేత్రయ్య పసితనంలో అల్లరి చిల్లరిగా తిరుగుతూ ఉండేవాడు. తోడి పిల్లలతో గిల్లి కజ్జాలు పెట్టుకొనేవాడు. బ్రాహ్మణ కుటుంబంలో జన్మించినా, బాల్యంలో చదువు సందెలు అబ్బలేదు. పెద్దవారు ఈ అల్లరి పిల్లవాణ్ని గొడ్ల కాపరిగా చేశారు. అప్పుడు ఒక మహాయోగి ఇతనిని కరుణించి గోపాల మంత్రోపదేశం చేశాడట. గోపాల మంత్రం జపించిన వరదయ్యకు వేణుగోపాలస్వామి దర్శనమిచ్చి అనుగ్రహించాడట. ఆ దేవుని దయతో చక్కటి పదాలు చెప్పనారంభించాడు. ఇదొక కథ. ఇతడు గొడ్లకాపరి అయినా చక్కటి విద్యాబుద్ధులు నేర్చినట్లు తెలుస్తుంది. తెలుగు, సంస్కృత భాషలలో సంగీతం, అభినయం మొదలైన కళలలో విశారదుడైనాడు. మువ్వగోపాల ముద్రతో చక్కటి శృంగార పదాల రచన కొనసాగించాడు. కాని ఆయనను పోషించే రాజులు సమీపంలో లేరు.

ఆనాడు దక్షిణ దేశంలోని తంజావూరు, మధుర నాయకులు తెలుగు సాహిత్యాన్ని పోషిస్తూ ఉండేవారు. అంటే కళలకు కాణాచి అయిన విజయనగర సామ్రాజ్యం పతనమైన వెనుక తెలుగు కవులు, కళాకారులు దక్షిణ దేశానికి వలస వెళ్లవలసి వచ్చింది. కూచిపూడి నుంచి కూచిపూడి భాగవతులు తంజావూరుకు వలసపోయినట్లు చరిత్రవల్ల తెలిసే విషయం. ఇదే రీతిగా క్షేత్రయ్య సైతం చక్కటి పద కవిత చెబుతూ దక్షిణదేశానికి వలస వెళ్లాడు.

క్షేత్రయ్య మొదట దర్శించిన రాజు తుపాకుల వెంకట కృష్ణప్ప నాయకుడు. ఇతడు చెంజిని పరిపాలిస్తూ ఉండేవాడు. ఇతనిమీద చెప్పిన పదాలు మూడు మాత్రమే లభించాయి. తరువాత తంజావూరు నాయక రాజైన రఘునాథ నాయకుని ఆశ్రయించినట్లు తెలుస్తుంది. కాని రఘునాథునిపై చెప్పిన పదాలు దొరకలేదు. ఆ వెనుక మధుర తిరుమల నాయకుని ఆశ్రయించి రెండువేల పదాలు రచించి ఇచ్చాడు.

ఆ తరువాత తంజావూరు విజయరాఘవనాయకుని ఆస్థానం చేరాడు క్షేత్రయ్య. ఆ రాజు స్వయంగా యక్షగానకర్త. కవులను, కవయిత్రులను పోషించినవాడు. ఆ రాజుపై అనేక పదాలు రచించాడు. క్షేత్రయ్య ఎక్కువ కాలం విజయరాఘవుని ఆస్థానంలో ఉండేవాడు. విజయ రాఘవుడు క్షేత్రయ్యను ఎంతో అభిమానించి గౌరవించాడు. అందువల్ల ఆస్థాన కవులకు ఈర్ష్య పుట్టి క్షేత్రయ్యను రాజునుంచి వేరు చేయాలని ప్రయత్నించారు. కాని విఫలులైనారు. విజయరాఘవ నాయకుడు క్షేత్రయ్యను ఘనంగా సత్కరించాడు. విజయ రాఘవ ముద్రతో రచించిన క్షేత్రయ్య పదాలు పన్నెండు లభించాయి.

అటు తర్వాత క్షేత్రయ్య గోలకొండ పాదుషాను దర్శించాడు. పాదుషా అతనిని ఆదరించాడు. పాదుషా ఆస్థానంలోని తులసిమూర్తి అనే పదకవిని ఓడించి, నలభై రోజులలో 1500 పదాలు రచించి పాదుషా సత్కారానికి పాత్రుడయ్యాడు.

క్షేత్రయ్య ఈ విధంగా అనేక రాజ సత్కారాలు పొంది విజయోత్సాహంతో స్వగ్రామమైన మొవ్వకు తిరిగివచ్చాడు. చిన్ననాటి స్నేహం వల్లనో, ఆయా ఆస్థానాల్లో చవిచూచిన శృంగార ప్రభావం వల్లనో, మొవ్వ వేణుగోపాలస్వామి ఆలయంలోని దేవదాసిని ప్రేమించాడు క్షేత్రయ్య. ఆమెకు దైవారాధనమేగాని ఇతర విషయాలు పట్టవు. క్షేత్రయ్య ప్రేమను తిరస్కరించింది. అయితే ఒక నియమం పెట్టింది. భక్తిపూరితమైన పదాలు రచిస్తే అతని ప్రేమను స్వీకరిస్తానని ఆ దేవదాసి చెప్పింది. కాని ఇది అతనికి కొత్త. అతడు రక్తినేగాని భక్తి నెరుగడు. అతనికి ఇది అగ్నిపరీక్ష అయినది. కాని పట్టిన పట్టు వదలక వేణుగోపాల దేవుని ఉపాసించి భక్తి భరితంగా పదం చెప్పి తరించాడు. ఆనాటినుంచి మధుర భక్తిపరుడు క్షేత్రయ్య. తానే నాయిక. నాయకుడు మువ్వగోపాలుడు. భగవంతు డొక్కడే పురుషుడు. ఇతర ప్రాణులన్నీ స్త్రీలు అనేది మధురభక్తి సిద్ధాంతం. తదనుసారం మధురభక్తితో క్షేత్రయ్య పద రచన చేశాడు. అంతకు పూర్వ విషయాలను విస్మరిం

చాడు. అతని మనస్సులో ఇప్పుడు దేవదాసి ఊసే లేదు.

మరల క్షేత్రయ్య పుణ్యతీర్థాలకు బయలుదేరాడు. మొదటి యాత్రలో రాజులను ఆశ్రయించి శృంగార పదాలు చెప్పిన క్షేత్రయ్య, ఈ రెండవ యాత్రలో మధుర భక్తితో ఆయా దేవతల మీద పద రచన చేసి తరించి ఇతర భక్తులకు తరణోపాయం చూపించాడు. ఆంధ్రదేశమే గాక దక్షిణదేశమంతా పర్యటించాడు. వివిధ దేవాలయాలు సందర్శించాడు. సందర్శించిన ప్రతి దేవుని మీద ఆ దేవుని ఉపముద్రతో మువ్వ గోపాల మకుటంతో పదాలు రచించాడు. కంచిలోని వరదరాజస్వామిపై రచించినవి పదిహేడు పదాలున్నాయి. వాటిలో 'మగువ తన కేళికా మందిరము వెడలెన్' అనేది సుప్రసిద్ధమైనది.

తిరుపతి వేంకటేశ్వరుడు, చిదంబరం తిల్లా గోవిందస్వామి; తిరువళ్లువరు వీరరాఘవులు, కరిగిరి వరదుడు, చెవ్వంది లింగడు, యదుగిరి చెల్వరాయుడు, వేదపురి నిలయుడు, సత్యపురి వాసుదేవుడు, ఇనపురిస్వామి, శ్రీనాగశైల మల్లికార్జునుడు, శ్రీరంగేశుడు, ఆది వరాహుడు అనే దేవతలపై క్షేత్రయ్య పదరచన చేశాడు. మధుర భక్తిని తన పదాలద్వారా చాటి చెప్పిన మహాభక్తుడు క్షేత్రయ్య.

పూర్వాశ్రమంలో శృంగారి అయినా తరువాతి జీవితంలో మధుర భక్తిపరుడైన క్షేత్రయ్య క్రీ.శ. 1590 ప్రాంతంలో జన్మించాడు. 1675 వరకు జీవించినట్లు తెలుస్తూంది. అయితే ఇతని జీవిత పరిసమాప్తి ఎప్పుడు, ఎక్కడ, ఎలా జరిగిందో చెప్పటం సాధ్యంకాని విషయం.

క్షేత్రయ్య తెలుగు సాహిత్యానికి, సంగీతాభినయాలకు చేసిన సేవ అపారం. ఇతని పదాలలో తెలుగుదనం ఉట్టిపడే పలుకుబళ్లు, సుడికారాలు, జాతీయాలు, సామెతలు, అనేకం ఉన్నాయి. తెలుగుదనం పోషించిన మహాకవి తిక్కన తరువాత క్షేత్రయ్యనే మనం పేర్కొనవలసి ఉన్నది. ప్రతి పదమూ దీనికి ఉదాహరణమే అవుతుంది.

క్షేత్రయ్య పదాల్లో తెలుగు పలుకుబళ్లు కోకొల్లలుగా వచ్చి చేరిపోయాయి. "బాగాయె నీ వగలెల్ల మా బాగాయె" అనే పదంలో 'బాగాయె, మాబాగాయె' అన్నది పలుకుబడి. పల్లెపట్టులలో ఈనాడూ వినిపించే పలుకుబడి. ఇది అర్థవంతమై వక్త హృదయాన్ని స్పష్టం చేస్తుంది. కొన్ని ఉదాహరణలు: "అంగడి బెట్టకుము, అడుగులకు మడుగులొత్తిన, అసురుసు రన్నది, ఇరు చెవి నెరుగనీక, కన్నుల గట్టి నట్లుండు, కాళ్ల వేళ్ల బెనచు, తలవాకిలి ఇల్లుసుమీ, పూచిన తంగేడు వలెనే, పెదవులు తడపుచు, వెన్నవంటి మనసు".

ఇలాగే క్షేత్రయ్య పదాల్లో చక్కటి సామెతలకు కొదవలేదు. "అల్పునికి ధర నైశ్వర్యము వచ్చితే అరదరాతిరి గొడుగు బట్టుకొన్నట్లు; ఎన్న డెక్కనివాడు గుర్రమెక్కితే ముందు వెనుకై నట్లు"- అనేవి ఈనాడూ తెలుగువారు వాడే సామెతలు. మరికొన్ని సామెతలు:"కలిమిలేము లనగ కావడి కుండలు; చెరుకు తీపని వేరుతో పెకలించేవు; తల|వ్రా తెవరికి తప్పింప వశమే; మేక వన్నె పులి వంటి చెలులే; వ్రతము చెడిన సుఖము లేదాయె".

క్షేత్రయ్య పదాలలో సంగీత సాహిత్యాలు సమంగా ఉంటాయి. సంగీతానికి గూడ ఎనలేని సేవ చేశాడు. అపురూప రాగాలను క్షేత్రయ్య ప్రయోగించాడు. ఇతడు వాడిన రాగాలు మహావాగ్గేయకారుడయిన త్యాగయ్యకు కూడా ఆదర్శాలయ్యాయి. పదాభినయం క్షేత్రయ్యతోనే ఆరంభమైంది.

కమనీయ కవితకు, చక్కటి తెలుగు పదాలకు కాణాచి అయిన ఒక క్షేత్రయ్య పదం :

**"పల్లవి:** ఏమని తెలుపుదు-నేలాగు తాళుదు
నేమి చేతునో చెలియా!

**అనుపల్లవి :** భామరో యూరికి - బయలుదేరెడు వేళ
ప్రేమమీర నాసామి-పిలిచి చెప్పినమాట
"ఏమని"

**చరణం :** అన్నమింటక - అతివెతనొందకు
కన్నీరు నింపకు - కలవరింపకు మని
ఎన్నెన్నో విధముల - హితవులు తెలుపుచు
కన్నీరు నించుచు - కాంతుడు చెప్పినమాట
"ఏమని"

నిడివి కన్నుల నీరు - నించుచు తలయూచి
తడవక వేగ - తానే వచ్చెదనని
అడుగడుగున కుసు - రసురని మదిలోన
కడు మోహమున ప్రాణే-శుడు పలికినమాట
"ఏమని"

ఏనోము నోచితినో?- ఎంతని వేడితినో
తానేమి వ్రాసెనో? - తలమీద విధియని
పూనికతోడ మా - మువ్వగోపాలుడు
"ఏమని"

ప్రియుడు ఊరికి బయలుదేరి వెళ్లుతూ ప్రియురాలికి చెప్పిన మాటలు. ఇందులో చక్కటి తెలుగుదనంలోని తేట, తియ్యదనాలు అనే గొప్ప గుణాలున్నాయి.

ఇటువంటి పద రచన చేసి తెలుగుదనం పోషించిన మహా పదకర్త క్షేత్రయ్య!

# ప్రశ్నలు

1. 'పదకవిత' అంటే ఏమిటి ?
2. క్షేత్రయ్య అనే పేరు ఎవరికి ఎందుకు వచ్చింది ?
3. క్షేత్రయ్య పర్యటించిన ప్రదేశాలను, అక్కడి విశేషాలను చెప్పండి.
4. క్షేత్రయ్య పదాల ప్రత్యేకత ఏమిటి ?

———

# ౯. పోతులూరి వీరబ్రహ్మం

ఎందరో మహాత్ములు, యోగులు, అవధూతలకు మన తెలుగు కాణాచి. అలాంటివారి కోవకు చెందినవాడు పోతులూరి వీరబ్రహ్మం.

విజయనగర సామ్రాజ్యం పతనమైన తరువాత మన దేశంలో ముస్లిం ప్రాబల్యం అధికమైంది. మతపరమైన దుష్కృత్యాలు పెచ్చరిల్లుతున్న కాలం ఆ క్లిష్ట సమయంలో జన్మించిన సిద్ధపురుషులలో పోతులూరి వీరబ్రహ్మం ఒకడు. ఆయన ఉపదేశమ్ములను తన తత్వాల ద్వారా నూతన పథం చెప్పి సామాన్య ప్రజల దగ్గరకు తీసుకొనిపోయి, హిందూ ముస్లిం ఐక్యతకు పాటుపడి, సమసమాజ సిద్ధాంతానికి రాచబాటలు వేసిన ద్రష్ట.



వీరబ్రహ్మం బ్రహ్మజ్ఞానస్వామియై   నందికొండ గ్రామ   వాస్తవ్య
ప్రకృతి గమనమునకు వీరభోగయాచార్యులు. వీర నారాయణ అనే పండితుల క్షేత్రపుత్రుడు. బాల్యంలోనే కొంత తల్లిదండ్రులు మరణించారు. వీర భోజయాచార్య వీరపాపాంబలు పెంచి పెద్దచేసి చదువు సంధ్యలు చెప్పించారు. అతని మొదటి పేరు వీరనారాయణుడు. తరువాత వీరబ్రహ్మేంద్రుడయ్యాడు. అతడు 17వ శతాబ్దిలో ఉండేవాడు. బాల్యంలోనే తండ్రి వీరభోజయాచార్యులు మరణించాడు ఆ కుర్రవాడు తల్లి వీరపాపాంబ దగ్గర సెలవుతీసుకొని దేశాటనంకొరకు బయలుదేరాడు.

బ్రహ్మంగారు కర్నూలు మండలంలోని బనగానపల్లి చేరి అక్కడ గరిమిరెడ్డి అచ్చమ్మగారి అరుగుపై కూర్చుండి ఉండగా, ఆమె 'నీవెవరి' వని ప్రశ్నించింది. తనకెవరూ లేరనీ, తనను వీరనారాయణ అంటారనీ అతడు సమాధానం చెప్పాడు. తన గోవులుకాస్తే తిండీ, బట్టా యిస్తా నన్నది. అత డంగీకరించాడు. సుమారు పన్రెండేండ్లు అచ్చమ్మగారింటనే ఉండిపోయాడు. ఈ సమయంలోనే అనేక మహిమలు చూపాడు. పశు వుల్ని తోలుకొనిపోయి మంచి పచ్చికబీడులో వాటిచుట్టూ గీతగీసి వదిలి దగ్గరలోఉండే గుహలో తపస్సుచేస్తూ 'కాలజ్ఞానం' రాస్తూ ఉండేవాడు. గీసిన గీతదాటి ఆ పశువులు బయటకు వచ్చేవికావు. ఎవరైనా లోపల ప్రవేశించాలన్నా వీలువడేదికాదు. ఈ వింత చూసినవారు అచ్చమ్మ గారితో చెప్పగా ఆమెవెళ్ళి చూచి ఆశ్చర్యపడింది. వీరనారాయణ అక్కడలేడు. అతడొక కొండ గుహలో ఉండగా చూసింది. గుహఅంతా దివ్యకాంతితో ప్రకాశిస్తూంది. అతని ఏకాగ్రతను పాడుచేయడం ఇష్టం లేక ఆమె తిరిగి వచ్చింది.

యథారీతిగా సాయంకాలం గోవులతో వీరనారాయణ ఇంటికి వచ్చాడు. వెంటనే అచ్చమ్మగారు అతనికి సాష్టాంగ నమస్కారంచేసి తన తప్పు క్షమించి, తనకు జ్ఞానోపదేశం చేయుమని వేడుకొంది. ఆమె కోరిన రీతిగానే సమీపంలోని యాగంటికి పోయి నిర్జన ప్రదేశంలో ఆమెకు

బ్రహ్మోపదేశం చేశాడు. అలాగే ఆమె భర్త వెంకటరెడ్డికి సైతం జ్ఞానోప దేశం గావించాడు. అప్పటినుంచి అచ్చమ్మగారు 'వీరబ్రహ్మం' గారిని పిలవడం ఆరంభించింది. బనగానపల్లిలో ఉండగానే అచ్చమ్మగారి ఏకైక పుత్రునికి దృష్టి ప్రసాదించాడు. అచ్చమ్మతోపాటు అన్నాజయ్య అనే బ్రాహ్మణుని శిష్యునిగా స్వీకరించి తాను గుహలో రచించిన 'కాలజ్ఞానం' బోధించాడు. ఈ మహిమలను చూచిన బనగానపల్లి ప్రజలెందరో ఈతని శిష్యులయ్యారు. చివరికి బనగానపల్లి నవాబు సైతం వీరబ్రహ్మం మహిమ లకు ముగ్ధుడై తన దర్బారుకు పిలిపించి సత్కరించాడు. అచ్చమ్మగారు వీరబ్రహ్మంగారికు కట్టించిన మఠంలో నిత్య నైవేద్యాలకై ఆ నవాబు కొంత భూమిని ఇనాంగా ఇచ్చాడు.

ఆ తరువాత కడపజిల్లా బద్వేలు తాలూకా 'కందిమల్లయపల్లి చేరుకొన్నాడు. 'పోతులూరి వీరబ్రహ్మం' అనే పేరుతో ఉండేవాడు. వడ్రంగంచేస్తూ తత్వాలు పాడుకొంటూ కాలం గడుపుతూ ఉండేవాడు. అక్కడుండగా పోలేరమ్మ జాతరకు చందా యిమ్మని ఊరివారడిగారు. తరువాత ఇస్తానని చెప్పాడు. ఒకదినం చందా ఇచ్చితీరాలని వారు పట్టు పట్టారు. అందరూ చూస్తుండగా, పోలేరమ్మచేత చుట్ట కాల్చుకోడానికి నిప్పు తెప్పించుకొన్నాడుట. వారందరు ఆశ్చర్యపడి ఆరాధించ నారం భించారు. ఆ విధంగా విగ్రహారాధనను, బలిఇచ్చే పద్ధతిని వ్యతిరేకించాడు.

వీరబ్రహ్మం సన్యాసికాడు. పెద్ద సంసారి. కందిమల్లయపల్లెలో ఉండగానే ఆయనకు శివకోటయ్య అనే ఒక విశ్వబ్రాహ్మణుడు తన కుమార్తె గోవిందమ్మనిచ్చి వివాహంచేశాడు. వీరబ్రహ్మం గృహస్థాశ్రమం లోనే జీవితాంతం గడిపాడు. ఆ దంపతులకు ఐదుగురు కుమారులు, ఒక కుమార్తె. ఆయన మనుమరాలు ఈశ్వరమ్మ గొప్ప తాత్వికురాలు. గృహ స్థాశ్రమం స్వీకరించి మోక్షం పొందిన మహనీయులలో వీరబ్రహ్మం ఒకడు.

హైదరాబాదు నవాబు వీరబ్రహ్మం ప్రసిద్ధిని విని పల్లకి పంపించి తన దర్బారుకు ఆహ్వానించాడు. నవాబు సగౌరవంగా స్వాగతం పలికాడు. కొంత సంభాషణ జరిగిన వెనుక దైవారాధన సమయమైందని వీరబ్రహ్మం చెప్పగా, అందుకు కావలసిన వస్తువులు పంపుతూ దీపారాధనకు మాత్రం నూనెకు బదులు మంచినీటిని పంపాడు. అది గమనించిన వీరబ్రహ్మం మంచినీటితోనే దీపం వెలిగించాడుట. వెంటనే నవాబు తన తప్పిదం గుర్తించి క్షమాపణ వేడుకొన్నాడుట. వీరబ్రహ్మం నవాబును క్షమించి ఆశీర్వదించి కాలజ్ఞానం బోధించాడు.

వీరబ్రహ్మం కులం, వర్ణం, జాతి, మతం గణించక అందరినీ తన శిష్యులుగా స్వీకరించి మతసమానం, సర్వ మానవ సౌభ్రాతృత్వం ప్రదర్శించాడు. ఇతని శిష్యులందరిలోను దూదేకుల సిద్ధయ్య ప్రసిద్ధుడు. ఈ గురు శిష్య సంబంధం అందరికీ ఆదర్శప్రాయం. సిద్ధయ్య పండ్రెండేండ్ల చిన్న వయసులోనే ఆదంబీబీ, పీరుసాహేబులనే తల్లిదండ్రుల్ని, ముస్లిం మతాన్ని వదలి వీరబ్రహ్మాన్ని ఆశ్రయించాడు. అతడు ఎంతో ప్రేమతో శిష్యునిగా స్వీకరించి జ్ఞానబోధ చేశాడు. ఈ శిష్యునికొరకు వీరబ్రహ్మం 'సిద్ధబోధ' అనే గ్రంథం రచించినట్లు తెలుస్తుంది.

సిద్ధయ్యలాంటివారికి ఎందరికో వేదాంతం బోధించి మతభ్రష్టుల్ని చేస్తున్నట్లు కడప నవాబుకు, సిద్ధవటం నవాబుకు కొందరు ఫిర్యాదు చేశారు. ఆ నవాబులు వీరబ్రహ్మాన్ని పరీక్షించి అతని మహిమలకు ఆశ్చర్యపడి సత్కరించారు. ఈ విధంగా వీరబ్రహ్మం హిందూ ముస్లిం సమైక్యానికి పాటుపడ్డాడు.

వీరబ్రహ్మం బ్రాహ్మణేతరులకు వేదాంతం బోధించడం సహించని పుష్పగిరి అగ్రహారికులు, పీఠాధిపతులు వాదంకొరకు ఆహ్వానించారు. వీరబ్రహ్మం వారితో సమరస వాదంచేసి, శంకరాచార్యుల మతోద్దేశాన్ని స్పష్టపరచి, గుణ కర్మలబట్టి ఎవ్వడైనా తత్వ విద్యాధికారి కావచ్చునని నచ్చచెప్పాడు. అందుకు సంతోషించి వారు బ్రహ్మరథం

వచ్చాడు. ఆనాటినుంచి అతనికి "పుష్పగిరి బ్రహ్మరథారూఢు"డనే బిరుదు వచ్చింది.

ఉపనిషత్తుల సారాన్ని వీరబ్రహ్మం పామర ప్రజలకు తత్త్వాల ద్వారా వివరించాడు. ఆ తత్త్వాలకు మంచి ప్రచారం వచ్చింది. ఈనాటికీ వినిపించే ఈ తత్త్వాల్లో చెప్పుకోదగినవి :

"చెప్పలేదంటనక పోయ్యేరు - నరులారా గురుని

చేరి మొక్కితే బ్రతుకు కేర్పడు" - అని పరమగురుడైన భగవంతుని స్మరించుమని ప్రబోధించాడు.

"ఇల్లు వాకిలి నాది యిల్లాలు నాదనుచు

యేల భ్రమసితివయ్యా మనసా!" అని వైరాగ్య భావ బోధ చేశాడు.

గురువులాగానే సిద్ధయ్య కూడా తత్త్వాలు రచించి పాడేవాడు. అందులో ప్రధానమైనవి :

"చిల్లర రాళ్ళకు మొక్కుచునుంటే -
చిత్తము చెడిపో నోరన్నా
చిత్తము నందున చిన్మయ రూపుని
చూచుచు నుండుటె సరేసరి"

అనే తత్త్వంలో విగ్రహారాధనను ఖండించాడు.

"ఏ కులమని నన్ను వివరము అడిగితే
ఏమని తెల్పుదు లోకులకూ,
పలుగాకులకూ, దుర్మార్గులకూ,
ఇక దుష్టులకూ" - అని కులానికి ప్రాముఖ్యమిచ్చిన వారిని నిరసించాడు. ఇలాగే ఎన్నో తత్త్వాలు.

# 8. డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావు

'మానవసేవయే మాధవసేవ' అన్నది అనాదినుంచి వస్తున్న నానుడి. 'ప్రాణి సేవయే పరమేశ్వర సేవ' అన్నది ఈ నడుమ వచ్చిన సూక్తి. ఏమైనా ప్రధాన మయింది మానవ సేవయే తమ జీవిత లక్ష్యంగా ఎంచి ఆచరించిన మహా పురుషుల కోవకు చెందినవారు డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావు. ఆయన తెలుగువాడు కావడం మనందరికీ గర్వకారణం.



ఈ ప్రపంచంలో ఎన్నో జీవులు పుడుతున్నాయి. మరణిస్తున్నాయి. అలాగే ఎందరో మానవులు జన్మిస్తున్నారు. కాల గర్భంలో కలిసిపోతున్నాయి. కాని ఒక మహాలక్ష్యం కొరకు జీవించినవారు చాలా కొద్దిమంది. మనకు తెలిసినంతలో అటువంటి తెనుగుతల్లి ముద్దు బిడ్డలలో ప్రథమ గణనీయులు డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావు. తల్లి రోగాన్ని చూచి తల్లడిల్లి, ఎవరికీ అలాంటి వ్యాధి రాకూడదని, దాన్ని నిర్మూలనానికి తపించిన దయావంతుడు. రోగనివారణే తన ధ్యేయంగా జీవితాంతం పరిశ్రమించిన జీవ రసాయన శాస్త్రవేత్త. శాస్త్రవేత్త మాత్రమే కాడు. ఆదర్శవంతుడైన అధ్యాపకుడు. తత్త్వవేత్త. అన్నిటిని మించి మానవతావాది సుబ్బారావు. ఇలాంటి సుగుణ సంపన్నుని తెలుగు విద్యార్థులు స్మరించక తప్పదు.

"కాల మహాత్మ్యము. వలయునంత కాలము మన కెప్పుడును చిక్కదు; నేడనేకులు రుజా పీడితులై మడియుచున్నారు. రేపు మడియ నున్నారు." కాబట్టి ప్రజలు రోగ పీడితులు కాకుండా ప్రయత్నించడం తన ప్రధాన కర్తవ్యమని భావించిన మహాపురుషుడు సుబ్బారావు. ఈ లక్ష్యంతోనే జీవితాంతం కృషి చేసినట్లు ఆయన జీవిత విశేషాలను పరిశీలించిన తెలియగలదు. తన తల్లి "స్ప్రూ" అనే వ్యాధితో మరణించడం చేత ఆ రోగ నివారణకు మందు కనిపెట్టాలని దీక్షతో ప్రయత్నించాడు. "స్ప్రూ" అనేది ఉష్ణ దేశాలలో విరేచనాలతో వచ్చే ప్రాణాంతకమయిన భయంకర వ్యాధి. రోగి జీర్ణాశయంలోని సున్నితపు పొర కంది పోతుంది. శరీరంలోని కొవ్వు త్వరత్వరగా కరిగిపోతుంది. నిస్సత్తువ, నీరసం పెరుగుతాయి. వ్యక్తి బరువు సగానికి పైగా తగ్గిపోతుంది. సాధారణంగా ఈ వ్యాధి ఉష్ణదేశాలకు వచ్చిన విదేశీయులకు వస్తుంది. కొందరు అభాగ్య భారతీయులకు కూడా రావచ్చు. ఆనాటికి ఈ వ్యాధికి సరైన మందు లేదు.

తన తల్లిలాంటి తల్లులెందరు ఈ వ్యాధితో మరణిస్తున్నారో ఎందరు తనలాగ తల్లిలేని బిడ్డలవుతున్నారో ఊహించిన సుబ్బారావు ఆ రోగ నివారణకు తగిన మందులు కనిపెట్టాలని పరిశోధించాడు. అతని కృషి ఫలించి మానవాళికి ఎంతో ఉపకరించింది.

ఈ మహానుభావుని జననం క్రీ.శ.1896లో తూర్పు గోదావరిజిల్లాలో రాజమండ్రి సమీపంలోని ఒక గ్రామంలో. అది విజ్ఞాన శాస్త్ర ప్రగతికి శుభోదయం. మానవాళికి మహోదయం. దిన దినాభివృద్ధి చెందు చున్న అతని బుద్ధి 'పుష్పం పుట్టగనే పరిమళించు'నన్నట్లు ఎంతో నిశితమై బహుముఖ ప్రశంసలకు పాత్రమైంది. తల్లిదండ్రులకు అమితమైన ఆనందానికి ఆకరమైంది. కాని సర్కారు గుమాస్తాగా పనిచేస్తూండిన ఇతని తండ్రి ఇతని పసితనంలోనే మరణించాడు. ఇతని విద్యాభ్యాసం కాకినాడలో కొనసాగింది. విద్యార్థి దశలోనే తన అధ్యాపకుల ఆదరాభిమానాలను చూరగొన్న కుశాగ్ర బుద్ధి అతడు. ముఖ్యంగా శాస్త్ర విజ్ఞానంలో

అతని ప్రతిభ అద్భుతంగా వ్యాప్తమవుతూ ఉండేది. అందరికీ తలలో నాలుకలా అతడు మెలుగుతూ ఉండేవాడు. తన వైద్య విద్యను మద్రాసు వైద్య కళాశాలలో పూర్తి చేసి ఎం.బి.బి.యస్. డిగ్రీని పొందాడు. జీవరసాయన శాస్త్రం (bio-chemistry) అతనికి అభిమాన విద్య. విద్యార్థి దశ నుంచి విజ్ఞాన శాస్త్రంలో లాగానే మత విషయాలలో కూడా అతనికి ఆసక్తి ఎక్కువ. ఉపనిషత్తులు, భగవద్గీత, కొరాన్, బైబిలు అతని పారాయణ గ్రంథాలు. హైందవ మతంపై ఎంతటి గౌరవమో ఇస్లామ్, క్రైస్తవ మతాలన్నా అతనికి అంతే ఆదరణ ఉండేది.

మద్రాసు వైద్య కళాశాల నుంచి వైద్య విద్యలో డిగ్రీ పుచ్చుకొన్నాక అతని ప్రతిభను గుర్తించిన అధికారులు శరీర శాస్త్రంలో నిర్దేశకునిగా నియమించారు. ఆ సమయంలో సుబ్బారావుతల్లి 'స్ప్రూ' వ్యాధితో మరణించింది. బాల్యంలోనే తండ్రి మరణించగా తానే తల్లీ, తండ్రీ అయి ప్రేమతో పెంచి పెద్దచేసిన మాతృమూర్తి మృతి సుబ్బారావుకు అంతులేని దుఃఖ కారణమైంది. అలాంటి వ్యాధులకు తగిన మందులు కనిపెట్టాలని, అందుకు తగిన శాస్త్ర పరిశోధనలు కొనసాగించాలని కంకణం కట్టుకొన్నాడు. ఆ దీక్షే సుబ్బారావును ప్రసిద్ధ శాస్త్ర వేత్తగా తీర్చి దిద్దింది. దీక్షకు తగిన దక్షత సైతం పూవుకు తావి వలె సుబ్బారావుకు తోడైంది. తెలివి తేటలు, పరిశ్రమ, పట్టుదల వీటి మూలంగా సుబ్బారావు అందరి మన్ననలకూ పాత్రుడు కావడంలో విశేషం లేదు.

సుబ్బారావు మహామేధావిగా నిరూపించుకొనే అవకాశం లభించింది. రామకృష్ణ మిషన్ వారి సహాయ సహకారాలతో విదేశాలలో వైద్యశాస్త్రంలో పరిశోధించే అవకాశం అందరికీ దొరికేదికాదు. ఇంగ్లండు వెళ్లి 'లండన్ ట్రాపికల్ స్కూల్ ఆఫ్ మెడిసిన్' లో తన ప్రతిభా నైపుణ్యాలతో అచిరకాలంలోనే డిప్లొమా సంపాదించాడు. ఈ సమయం

లోనే రిచర్డ్ స్టాల్ఫింగ్ అనే అమెరికన్ శాస్త్రవేత్తతో సుబ్బారావుకు పరిచయం కలిగింది.

సుబ్బారావును స్టాల్ఫింగ్ అమెరికాకు ఆహ్వానించాడు. అది విజ్ఞాన శాస్త్ర పరిశోధన చేయాలన్న కోరికగల సుబ్బారావుకు ఆనందం కలిగించింది. మల్లాది సత్యలింగ నాయకర్ ధర్మసంస్థ సహకారంతో 1923లో అమెరికాకు వెళ్లాడు సుబ్బారావు. న్యూయార్కులోని "హార్వర్డ్ స్కూల్ ఆఫ్ ట్రాపికల్ మెడిసిన్" లో గ్రంథాలయ పాలకుడుగా (Curator) కుదురుకొన్నాడు. ఆ సమయంలో జీవ రసాయన శాస్త్ర పరిశోధనలో ఇతనికి ఆసక్తి కలిగింది. డాక్టర్ 'ఆటో పాలిన్' అనే ఆచార్యుని పర్యవేక్షణలో రెండేండ్లపాటు పరిశోధనలు కొనసాగించి "పిహెచ్.డి." పట్టం పొందాడు. అచటి డాక్టర్ ఫిస్కే అనే పరిశోధకునితో కలిసి జీవ రసాయన శాస్త్రంలో పరిశోధనలు జరిపి ఎన్నో కొత్త విషయాలు కనుగొన్నారు. భాస్వరాన్ని మదింపు వేసేతీరులో ఒక నూతన పద్ధతిని వీరు కనుగొన్నారు. అది వీరిద్దరి పేర్ల మీద "ఫిస్కే సుబ్బారావు పద్ధతి" అని ప్రామాణికమై ఈనాడూ ప్రసిద్ధిలో ఉంది. అప్పుడే సుబ్బారావు ఇతర పరిశోధకులతో కలసి విటమిన్ బి-12 అనే పోషకాహార ద్రవ్యాన్ని గురించి ప్రత్యేక పరిశోధనలు చేశాడు. ఆ పరిశోధన ఈ నాటి పరిశీలకులకు కూడా మార్గ దర్శకం.

ఆ తరువాత 1940 లో అమెరికాలోని లెడర్లీ వైద్య పరిశోధన సంస్థలో సుబ్బారావు ఉద్యోగం చేపట్టారు. అచిరకాలంలోనే - 1942 లోనే- ఆ ప్రసిద్ధ ఔషధ సంస్థకు అధ్యక్షుడయ్యాడంటే శాస్త్రవేత్తగా సుబ్బారావు ప్రతిభా నైపుణ్యాలు స్పష్టమవుతాయి. శరీర శాస్త్రంలో సర్వతోముఖ జ్ఞానం సంపాదించడం, రక్తవిజ్ఞానంలో నిష్ణాతులైనవారిలో ఒకడుగా ఎంపిక గావడం ఆయన గొప్పదనానికి నిదర్శనాలు. శాస్త్ర పరిశోధకుడని అంతర్జాతీయ ఖ్యాతి వచ్చింది. తన పర్యవేక్షణలో ఎంతో మందికి చేయూత నిచ్చి ప్రసిద్ధ పరిశోధకులుగా తీర్చి దిద్దే అవకాశం లభించింది.

యల్లాప్రగడ సుబ్బారావుగారు నిరంతర పరిశోధన ఫలితంగా స్ప్రూ, పాండు రోగాల నివారణకు పనికివచ్చే ఫోలిక్ ఆసిడ్ (Folic acid) కనిపెట్టారు. క్షయరోగం నివారించే 'ఐసోనికోటినిక్ ఆసిడ్ హైడ్రజైడ్' (Isonicotonic acid hydrazide) అనే మందు కనిపెట్టారు. దీన్ని క్లుప్తంగా 'INH' అని వ్యవహరిస్తారు వైద్యులు. బోదరోగం నివారించే 'డైఇథైల్ కార్బమజైన్' (diethylcarbamazine) అనే ఔషధాన్ని కనుక్కున్నారు. ఈ మందునే హెట్రజాన్ (hetrazan), బానోసైడ్ (banocide), యూనికార్బజైన్ (unicarbozine) వంటి అనేక వ్యవహార నామధేయాలతో ఆయా మందుల కంపెనీలవాళ్లు అమ్ముతున్నారు. టైఫాయిడ్ క్రిముల వంటి వాటిని చంపి ఆరోగ్యం సమకూర్చటానికి సుబ్బారావుగారు 'క్లోరోటెట్రాసైక్లిన్' (chlortetracycline) అనే ఔషధం సృష్టించారు. దీన్ని ఆరోమైసిన్ (auromycin) మొదలైన పేర్లతో ఔషధాలయాల వాళ్లు విక్రయిస్తున్నారు. మానవ జాతి ఆరోగ్యంగా జీవించటానికి ఈ విధంగా ఆయన కనిపెట్టిన మందులు అనేకం.

ఇటువంటి గొప్ప శాస్త్రవేత్త, మానవతావాది 1948లో దివంగతుడయ్యాడు. నిద్రలోనే చివరి శ్వాస వదిలినట్లు తెలియవచ్చింది. హృదయ సంబంధపోటు కారణమంటారు. రోగాలతో పీడించబడే ఈ లోకాన్ని సజారహితం గావించే సమర్థుడైన ఈ మహామేధావి మరణంతో శాస్త్రవేత్తల సముదాయం 'ఒక ఆదర్శవంతుడైన పరిశోధకుని కోలుపోయింది. ఈ లోటు తీర్చడం సులభసాధ్యం కానిది.

ఈ మహానుభావుని విగ్రహం, హార్వర్డు విశ్వవిద్యాలయంలో ఉండడం విశేషం. అతడు మానవాళికి చేసిన సేవలను పురస్కరించుకొని ఆ విగ్రహం స్థాపించడం జరిగింది. అచటి ఫలకంమీద 'ఆచార్యుడు, శాస్త్రవేత్త, తత్వవేత్త, మానవతావాది' అనే అర్థాలువచ్చే ఆంగ్లపదాలు కనిపిస్తాయి. అంతేగాదు. గుంటూరు వైద్యకళాశాల ఆవరణలో

సుబ్బారావు నిలువెత్తు విగ్రహం ఉంది. మన తెలుగువాడు ఎంతటి ప్రతిభావంతుడో తెలుసుకోడానికి ఇది ఉపకరిస్తుంది. ఇటువంటి మహా పురుషులను సర్వదా సంస్మరించటం, వారి ఆదర్శాలను ఆచరణ సాధ్యం చేయటం మన కనీస కర్తవ్యాలు.

## ప్రశ్నలు

1. సుబ్బారావుగారి బాల్యవృత్తాంతం వర్ణించండి ?
2. యల్లాప్రగడ విద్యాభ్యాసం వివరించండి ?
3. సుబ్బారావుగారు ఏ విదేశ శాస్త్రజ్ఞులతో కలిసి పనిచేశారు ?
4. ఆయన కనిపెట్టిన మందులేమిటి ?

లేదా

ఆయన ఏయే వ్యాధులకు మందులు కనిపెట్టారు ?